# ఏకాదశి మహాత్మ్యము



రచయిత

సత్యా వెంకయ్యచౌదరి

ప్రతులు 1000

ముఖచిత్ర రచన:
యస్. ఆర్. స్వామి
దొండపాడు, తుళ్ళూరు మండలం.

ప్రథమ ముద్రణ
ప్రభవ వసంతము
మే - 1987



వెల : రు 4-00

ప్రాప్తిస్థానము:
నర్రా వెంకయ్య చౌదరి
సుగమ హిందీ నికేతన్
తుళ్ళూరు - 522 237
గుంటూరు జిల్లా

# నివేద్యము

ప్రియ పాఠకులకు విజ్ఞప్తి. గత ముప్పది మూడు, ముప్పది రెండు సంవత్సరముల క్రితము "పుష్పాంజలి", "విశ్వ విజయి", అను పొత్తముల రచించి ముద్రించి ప్రకటించితిని. గొప్ప పాండిత్యము లేకున్నను, వ్రాయగల నను ధైర్యము, వ్రాయవలెనను సంకల్ప మున్నందున నా లేఖిని సరళ సాహిత్య క్షేత్రములో పరవళ్ళు వెట్టసాగినది. వెలుగులోనికి వచ్చిన కబ్బములు సజ్జనుల మన్నన లందినవి. ఆశీస్సు లందసాగినవి. అభినందన లందుచుండ-ఉల్లాస పడని వారుండరుగదా! ఇంకను కల్పనా లోకమున నా కలమొక విహంగమై విహరింప దొడంగెను. అట్టి తరి దేశ కాల పరిస్థితుల నాలోకించి నాటి వాదములకు దగు ప్రత్యుత్తరములు పాత్రలద్వారా కొనసాగునట్లు ప్రయత్నించితిని. అందు సఫలత సిద్ధించినదో లేదో పాఠకులే నిర్ణేతలు.

మరియొక మనవి - దోష రహితమగునది, వంక లేనిది, సర్వజన సమ్మోద మందగలదు- యేదియులేదు. ఉదాహరణకు - చారుసుందరుడగు చంద్రుని యందు మచ్చ గనిపించుండ- అన్య వస్తువులు నిష్కళంకము లెట్లగును? అందుకే "తప్పు లెన్నువారు తమ తప్పు లెరుగరు" అన్నారు వేమనగారు. కాన దోషాన్వేషణకు పూనుకొనక గుణగ్రాహ్యు లగుదురు గాక !

కావ్య కళను సమాజ శ్రేయస్సునకే చేపట్టినను, నాటి నా కవితా శిల్పమంతయు "కళ కళ" కొఱకే భాసించినది. ఎందులకందురా? నాకు గ్రంథముల ప్రకటించగల ఆర్థిక సత్త లేకపోవుటయే ముఖ్య కారణము. అలా అప్పటినుండి నా రచన లన్నియు ముద్రణకు నోచికొనక అజ్ఞాతంగానే వుండిపోయినవి. ఐనను నా లేఖిని విపిగిపోలేదు, అలసిపోలేదు, విశ్రాంతి కోరనూలేదు.

ఒకనాటి మాట. ఎక్కడినుండియో ఒక పుస్తకముల వ్యాపారి నా నెలవునకు వచ్చెను. అతడు ఊరూరు తిరిగి పుస్తకము లమ్ముకొనుట వృత్తిగా చేపట్టినాడట! ఆతనికి ముద్రించిన నా పుస్తకముల జూపితిని. అతడు చదివి సంతసించి కొన్నిటిని కొనెను. మాటల సందర్భములో- అతడు- "ఏకాదశి మహాత్మ్య మను గ్రంథము లభించుటలేదు. ఎందరో అడుగుచున్నారు. మీరు వ్రాసియిచ్చినచో నేనే అచ్చొత్తించెదను. మీకు కొన్ని ప్రతులిచ్చి తక్కినవి అమ్ముకొందు" ననెను. నేనును సమ్మతించితిని. ఆ వ్యాపారి మూడవ రోజున వచ్చి "మోహిని రుక్మాంగద" యను నొక ప్రాత నాటక పుస్తకమును నిచ్చి "దాని ఆధారముతో గ్రంథము రచింపుడని" వెడలిపోయెను.

కొన్నాళ్ళకు ఆ నాటకములోని పాత్రలను కథాంశమును గైకొని పౌరాణిక కథకు వలయు భాష నుపయోగించుచు, పాత్రల సన్నివేశము నాటకీయముగ నుండునట్లు పుస్తకమును రూపొందించితిని. ఇప్పటికి గ్రంథము వ్రాయబడి ఇరువది తొమ్మిది వసంతములు గడచెను. పుస్తక విక్రేత ఇంతవరకు రాలేదు. అతడేమయ్యెనో తెలియదు.

ఇట్లు వ్రాత ప్రతులలో నిదియు నొకటిగా నిలిచిపోయినది. ఇటీవల నా "భావతరంగాలు", "జ్ఞాన దీపిక" అను పుస్తకములు ప్రకటింపబడినవి. పాఠకలోకము సంతసించినది. సహృదయుల సహకారమున "ఏకాదశి మహాత్మ్యము" ముద్రింపబడినది. ఇప్పుడు మీ కరకమలము లలంకరించి ముదమందనున్నది. అందుకొని ఆదరింతురుగాక! తథాస్తు!

సుగమ హిందీ నికేతనము
తుమ్మూరు, 18-5-1987

ఇట్లు
నత్తా వెంకయ్యచౌదరి

ఓమ్ నమో నారాయణాయ

# ఏకాదశి మహాత్మ్యము

౧

అది నైమిశారణ్యము. అందు రమణీయ లతావేష్టితం బగు పర్ణకుటీరంబు కలదు. అందు సూతుఁడు నివసించుచుండెను. ఆ మహనీయుఁడనేక పౌరాణిక చరిత్రలఁ దెల్పుట శౌనకాది మునులు వినుట పరిపాటి. ఒకనాటి సాయం సమయమున సూతుఁడొక శిలా వేదికపై కూర్చొనియుండ-యెదుట మృగచర్మములందాసీనులైన మునులిట్లు ప్రార్థించిరి. "మహాత్మా! మీ వలన ననేక పవిత్ర చరిత్రలవిని ధన్యాత్ములమైతిమి. కాని ఏకాదశి మహాత్మ్యంబించుకఁ దెల్పరైతిరి. వినిపించి కృతార్థులజేయ వేడుచున్నాము.". అప్పుడు సూతుఁడాదరసూచితహాసవదనుఁడై ఇట్లు చెప్పఁదొడంగెను:

మునులారా! ఆ మహావ్రతమొనర్చిధన్యులై తరించిన వారనేకులు గలరు. నేటి కందొక్కరి చరిత్రమాత్ర మెఱింగింతు నాలకింపుడు. పూర్వము విదిశానగరమును రుక్మాంగదుఁడను! మహారాజు పాలించుచుండెను. ఆ రాజు సత్యవ్రతుఁడై, ధర్మశీలుఁడై తన ప్రజలఁగన్న బిడ్డలవలె పాలించుచుండెను. ఆ రాజున కనుకూలవతియును, వైష్ణవ భక్తి పరాయణియునగు సంధ్యావతీదేవి సతియైయుండెను. ఆ పుణ్యదంపతులకు సుగుణ సంపత్తియందుఁ దల్లి దండ్రు

లకుఁదగిన సుతుఁడు ధర్మాంగదుఁడను పుత్రుడుండెను. ఒక్క మాటలోఁదెల్పవలెనన్న యీ రాజ పరివార మాదర్శము నకు నిలయమనియే తెల్పవలెను.

ఆ రాజు రాసకార్యములఁజక్కబెట్టుచు శాంత్యాభివృద్ధికి, దుఃఖశమనమునకు సుసాధనంబని యేటేట ఏకాదశి వ్రత మాచరించుచుండెను. తన ప్రజలందరకును వ్రతమునకు వలయు సంభారముల నుచితముగా నొసంగి వారిని కూడ వ్రతమొనర్ప ప్రోత్సహించుచుండెను. దేశప్రజలును, తానును దశమినాఁడేక భుక్తము, (ఒక్కపూటభోజనము) ఏకాదశినాఁడుపవాసము, ద్వాదశిదినంబున పారాయణ మొనర్చుచుండెను. అందువలన జరకు గురిగాక, రోగముల ననుభవింపక, మృత్యువాతఁబడక పుట్టిన వారెల్లరు సజీవులై యుండిరి.

"ఒకరి మేలు వేరొకరికి కీడు" అనులోకోక్తిననుస రించి ప్రేతపురికి నష్టము వాటిల్లెను. పాప మా ప్రేతపురాధి నేత చింతింపసాగెను. ఆ సమయమున కలహాభోజనుఁడును, త్రిలోక సంచారియునగు నారదమహర్షి వీణె మీటి మధుర గానంబొనర్చుచు నచ్చోటికేతెంచెను ఆశ్చర్యవదనుండై నారదుఁడిట్లనియెను—"ప్రేతపురాధిపా! చింతగానుంటివేమి? మరల సావిత్రివంటి పతివ్రతలెవరైనను మిమ్ము తికమక పెట్టిరాయేమి?" నారదుని ప్రశ్నకు వైవస్వతుండిట్లు తన దుఃఖమును ప్రకటింపదొడంగెను.

మునీంద్రా! మీ రెరుంగని దొండుగలదా? ఐనను నడిగిన వారికి దెల్పుటయు సముచితము. కావున వినిపించుట

నా వంతు వినిన పిదప మదీయ కష్టతరుణోపాయమును దెల్పుట మీ వంతు నా దుఃఖకారణమిది-

సీ॥ తల్లిదండ్రుల యాజ్ఞ తలదాల్పనటువంటి
చెనటు లిచ్చటి కిప్డుచేరరైరి,
పంటపైరులబీకి పాడుచేయుచునుండు
కుమతులు నా కడ కూడరైరి,
చెలిమిసేయుచునుండి చెరుపలోనెంచెడి
ద్రోహులీ త్రోవను ద్రొక్కరైరి,
పీడించి యన్యులఁ బెద్దవారైనట్టి
మోసకాండ్రిచ్చట మూగరైరి,

గీ॥ దోసములఁజేసి మీసాల దువ్వుకొనెడి
కపటవర్తను లింతకు గానరారె!
రౌరవము మారి ప్రేతపురమ్ము నేఁడు
సర్వనాశనమగుచుండె సంయమీంద్ర!

యముని పలుకులకు నారదుఁడు చిరునవ్వు నవ్వుచు "వైవశ్వతా! చీకటిరాత్రులకై నిరీక్షించు చోరుని విధమ్మున నున్నది మీ విచారము! భూలోకమునందు నిట్టి దుర్మార్గు లుండిరనియు, వారు రాలేదనియు జింతించుచున్నారా? రుక్మాంగదుని పాలనంబున యట్టివారు లేరనియేనమ్ముఁడు పూర్వ మెవరైనను పాప మొనర్చిన వారున్నారందువా? ఏకాదశీవ్రతఫలమ్మున దినకరు ప్రఖరకిరణకాంతికి గర గర కరగిపోవుహిమ సమూహంబునుంబోలె వారి పాపములు పటాపంచలైనవి. ఇఁక జరామరణములు వారి దరిజేరవు.

యిప్పుడు మీ పదవి యేమగునో యని శంక కలుగుచున్న” దని యూరుకొన-అప్పుడు యముఁడిట్లనియె-మహర్షి! నా హితవుకోరువారు మీ కన్నమరెవ్వరునులేరు. మీ కెతగిన-ఉపాయముజెప్పి, నా కష్టములఁదొలగించి పుణ్యముగట్టుకొను మన, నారదుఁడిట్లనియె-“ప్రేతపురాధిపా! మీ కిత్తరుణమున గష్టముకోపాయమును దెలుపగల మహనీయుఁడా పద్మసంభవుఁడు దక్క మరెవ్వఁడునులేడు. నేనచ్చటికే వెళ్ళుచుంటిని, వత్తురా” యన శమనుడెంతయో సంతసమున-“మునిరాజా! నా కంతకన్న నేయవలసిన దేమున్నది? ఇప్పుడే మీ వెంట నడిచి వచ్చుచున్నాను పదుఁ”డని పల్కెను. అంత వారిరువురు సత్యలోకమునకేగిరి.

౨

అది సత్యలోకము మనోజ్ఞమహదానంద కళాసంభరితము. సరస్వతి సమేతుఁడై స్రష్టసృష్టియొనర్చుచుండెను. ఇంతలో నారదుడును, యమధర్మరాజును విచ్చేసిరి. వారిం గనుంగొని ప్రజాపతి దరహాసవదనుఁడై తగినయాసనంబులొసంగెను. వారిరువు రాసీనులైరి. బ్రహ్మదేవుఁడు యముని ముఖవైవర్ణ్యమును పరికించి-“ప్రేతరాజా! మీరిట్లు చింతాక్రాంతచిత్తులై యుండుటకుఁగారణమెద్ది? సకలలోకభయంకరులగు మీ దుఃఖమునకు కారణంబేమి?” అని ప్రశ్నింప యముడిట్లు దెలుపసాగెను-“పద్మసంభవా! నిఖిల ప్రాణికోటి నిర్మాణ సంధాతలగు మీకుఁదెలియనిదొండుగలదా? చల్లకు

వచ్చి మొంత దాయువారుందురా? నా కష్టము నెరింగింప వచ్చితిని దాని నివారింపగలవారు మీరు దప్పమరెవ్వరును లేరు. ఏ మందురా! వినుఁడు-

సీ॥ ఆరిపోవుచునుండె నగ్నికుండంబులు
పడవేసి పీడింప పాపిలేక,
త్రుప్పు బట్టుచునుండె నెప్పటి నుండియో
బాకులకేమియు పనులులేక,
కాళ్ళారఁజాపిరి కాలకింకరులెల్ల
బంధించి తెచ్చెడి పాపిలేక
గడ్డిబట్టెను నాదు కర్మశాలంతయు
దుష్టులు నడిచెడి త్రోవలేక,
కుదురుగా గూరుచోనలేక గూబవోలె
నదురు బెదురులతోడ నల్లాడుచుంటి
పద్మసంభవ! చెడిపోవ పాలనంబు
దిక్కు నీవని వచ్చితి దిక్కుకిప్డు.

అని మ్రొక్క, ఆర్ద్రహృదయుండగు విరించి- "మీ పాలనంబు సురక్షితముగా నుండ బ్రయత్నింతు చింతింపకుఁడని యూరడింప; సెలవంది యముండును నిజపురంబున కరిగె. నారదుండంతట వెడల యత్నింప కొలదికాలము తన యొద్దనే యుండ విధాతకోరగా నారదుఁడంగీకరించె.

మరునాడు చతురాననుఁడు తన చాతుర్యమంతయును కేంద్రీకరించెనో యన నొక చక్కని బాలికను సృజయించెను. ఆ బాల క్షణక్షణ వర్ధమానయై కొలది ఘడియలకే

యువతి యయ్యెను. ధాత యామెను దివ్యాంబరములతోను, రత్నరంజిత సుంద రాభరణములతోను నలంకరించి— "బిడ్డా! భూలోకంబున రూపలావణ్య రాశియు యశోవిలాశియు నగు రుక్మాంగద మహారాజు గలడు. యోగికాని యోగియై యత డేకాదశీ వ్రతమొనర్చుచుండె. అతఁ డట్లే యొనర్చుచుండిన పుట్టిన వారెల్లరు స్వర్గసుఖములెల్ల భూలోకమందే యనుభవించుచు మృత్యుంజయులై యన జీవించియుందురు. స్వర్గ, ప్రేతపురాధినాథులు తమ యధికారముల కోల్పోయి ఖిన్నులై యున్నారు. విధియను పేరందిన కతంబున వారి కష్టముల దొలంగించుటయు నా విధి యయ్యె. నిన్నందులకే సృష్టించితిని. మోహిని యను పేరుతో భూలోకంబున కరిగి, రుక్మాంగదుని నీ మోహజాలములో జిక్కించుకొని, నీ యాజ్ఞకు బద్ధుఁడై యుండుటకు వాగ్దానము జేయించుకొని, తదుపరి వివాహమాడి వ్రతమును మాన్పింతువేని నా మాటదక్కు" నన, వినయవచనంబుల మోహిని యిట్లనియె:—

"పితృదేవా! నన్నబలగా సృష్టించియును నిట్టి ప్రబల కార్యమొనర్ప నేల పురికొల్పుచున్నారు? ఆ భూపాలుఁడు పుణ్యకార్యాచరుణుఁడైన చూచి సహింపలేక పోవుటయా దిక్పాలుర ధర్మము? ఇది వారి స్వార్థబుద్ధి పాలకులు దమ కార్యముల గొనసాగింప నెట్టి దుష్కార్యములనైనను జేయ వెనుదీయరుగదా! వీరి సుఖాభిలాషులై మారిట్లు ప్రయత్నించుచుండిన నాపన్న మానవానీకమునకు దిక్కెవ్వరు? వారినే

పన్నగడతో రక్షింతురు? త్రిభువనంబులనున్న పాలకులదొలగించి ప్రజా ప్రభుత్వం బగునట్లు జేయరాదా? స్వార్థలోలుపుల నణగించరాదా?"యని వేడుకొన చతుర్ముఖుం డిట్లనియె:-

"బిడ్డా! నీ కోరిక కనువుగాఁ కలియుగంబున జరుగును. అప్పుడు ప్రజలు స్వేచ్ఛగా నాయకుల నెన్నుకొందురు. సుఖింతురు. స్వర్గవాసుల సురాపానము, జంతుహత్య, జారతనము మొదలగు దుర్గుణంబులు నశించును. అచ్చోట కూడ ప్రజా ప్రభుత్వ మేర్పడును. కాని ప్రేతపురాధిపతిని మాత్రము పదవిచ్యుతుని గావింపను. దుర్మార్గులకు దగిన దండనల దండధరుఁడే - యిడ సమర్థుడు. అమ్మా! నీ వాలసింపక భూలోకంబున కఱిగి, కార్యసాధన యందు నిమగ్నవగుము. అబలవని భావించి నిరుత్సాహ పడవలదు. సబలవై సఫలీకృత మనోరథవగు" మన, నందుల కామెయు నంగీకరించె. అంతట నారదునిఁ బిలిచి "కుమారా! నీవీ బాలకుఁ దోడుగా వెడలి రుక్మాంగదుఁ డామెను గలిసికొనుటకుఁ దగు యత్న మొనర్పుము. సర్వ మెఱింగిన నీకు నెక్కువగాఁ జెప్పఁ బనిలేదని నమ్మితి"నన నారదుఁ డందుల కంగీకరించి మోహినితో భూలోకంబున కఱుగ బ్రహ్మకడ సెలవు గైకొనియెను.

అంత వారిరువురు విదిశానగర పరిసరా రణ్యాంబునం గల యొక్క శివాలయమున జేరిరి. కోనెలయందు కోమలి నుంచి "చెల్లీ! నేను రుక్మాంగదునితో మరల యేతెంతు; అంతవరకిందుండుము. రుక్మాంగదుఁడు వచ్చునప్పటికి శివ

పూజనొనర్చునట్లు నటించుము. అతఁడు మోహితుఁడైన పిమ్మట నీ యడుగులకు మడుగులొడ్డెడి వానిగా నొనర్పుము నీ గీసిన గీటుదాటనని యతనితో బాసజేయించుకొనుము. తదుపరి వివాహమాడుము. తదనంతరంబ పిత్రాజ్ఞ ననుసరించి, రుక్మాంగదునయోమయు గావించి స్వీయకార్య సాధనకు యత్నింపుము. ఇదియ నీవు సేయదగిన పని"యని నారదుఁడు బల్కనామెయు స్వీకృత స్మితవదనయై తల వంచెను.

అంతట నారదుఁడు రుక్మాంగదుని కడకరుదెంచ, రాజు సంతోషచిత్తుఁడై యర్ఘ్యపాద్యాదు లొసంగి సంయమిని సత్కరించె. నారదుని హేమపీఠంబున నాసీనుం జేసి నమస్కరించి, "మునీంద్రా! మీరాకకుఁ గారణమేమి?" యని యడుగ నారదుం డిట్లనియె-

నార- రాజోత్తమా! పుణ్యతీర్థాభిగమనంబుఁజేయుచు నీ రాజ్యంబు నందుగల కీకారణ్యంబున నొక్క శివాలయంబు దర్శించితి. అతుల కళాకౌశలముతో నేత్రపర్వంబొనరించుచున్నయా కోవెల నిర్మించుట కెంతకాలము బట్టెనో, యెంత వ్యయమయ్యెనో తెలిసికొన గుతూహలంబయ్యె. అందులకే నిటకరుదెంచితిని.

రుక్మా - మునివర్యా! ఆ మందిర విషయ మావంతయు నాకుఁ దెలియదే! పరమ పవిత్రమైన యా మందిర మీక్షింపఁ గాంక్ష కలుగుచున్నది. నాకా మందిరమును జూపుదురా?

నారద - అవశ్యముగా జూపింతు. రాజా! మీలాంటి భక్తులకు గాక మరెట్టివారలకుఁజూపిన, నభవునకు శుభము గల్గునా? నేనిప్పుడే వెడలుచున్నాడను. చూడఁగోరుదేని నా వెంట రమ్ము.

రుక్మాంగదుఁ డమితోత్సాహియై నారదుని వెంట యొంటిగా వెడలెను. కాంతారంబున ప్రవేశింప బొంతజెంకులు, రేగుచెట్లులు, గచ్చకోరింద పొదలు, కలేచెట్లు మార్గమునకు రెండువైపుల నుండెను. వాని నన్నింటిని దప్పించుకొనుచు చిట్ట చివరకు శివాలయము జేరిరి. ఆలయ పరిసరమంతయు పూలచెట్లతో, ఫలవృక్షములతో కన్నులపండువుగా గన్పట్టెను. అంతట నారదుండు రుక్మాంగదునితో "రాజా! అదియే పరమ పవిత్రంబగు శివాలయంబు. అందు గల చంద్రశేఖరు సందర్శించి కామ్యసిద్ధింబడయుము-నాకు వైకుంఠంబున పనియుండుటంజేసి వెళ్ళవలయును. పిపీలికాది బ్రహ్మ పర్యంతము నీపై మక్కువయుండు అట్టి నీకేమియు భయముండరాదు కానసంశయింపక నాకు సెలవొసంగుము." అన రుక్మాంగదుండు-"మహాత్మా! మీ కాజ్ఞ నొసంగుటకును, మిమ్మాపుటకును నేనెంతవాఁడను? మీ యనుగ్రహమ్మున నిప్పరమ పవిత్రుని నారాధించి ధన్యుఁడనయ్యెద. మదీయ కృతజ్ఞతాభివందనములందుకొని వెడలపోయెదరు గాక." యని నమస్కరింప నారదుండు-కామ్యార్థసిద్ధిరస్తని కదలిపోయెను.

౩

రుక్మాంగదుఁడా కోవెలఁ బ్రవేశింప, తోఁకరి మెరు పును నిరసించునట్టి యా భువనమోహిని కన్నులంబడెను. రాజామె లావణ్యమును జూచి విస్మితుఁడై-ఇది కలయా, కాదాయని సందేహ పడుచు, కన్నులు నులుముకొని మరలఁ జూడగా నప్పద్మనేత్రి శంకరునిముందు బువ్వులను బెట్టినిలిచి యస్పష్టధ్వనితో లోలోన గొణుకొనుచుండెను.

అభవు నారాధింప వచ్చిన రుక్మాంగదుఁడా భువనైక సుందరిని గాంచి, మోహవశుఁడయి యామె కడకేగి యిట్లు ప్రశ్నించెను.

రుక్మాంగదుఁడు:- సుందరీ! ఇచట నొంటరిగానున్న నీవెవ్వతెవు? వనదేవతవా? అప్సరసవా? లేక మానవాంగనవా? నిర్ణయింప జాలకున్న నా సందేహము దీర్పుము-వనదేవతవైనచో యింత చక్కఁగ నలంకరింపజాలవు. రత్నాభరణంబులకు బదులు పూసుగు పూసల దండలనో, గురిగింజపేరులనో ధరించిచియుండెడి దానవు. అప్సరసవేయైన బహుసఖీపరివేష్టితవై యుండెడిదానవు. మానవాంగనవే యయిన నిట్టియగ మ్యారణ్య మధ్యంబున నొంటరిగా రాజాలవు. నిజము నెరుంగ నా మనంబు వేగిర పడుచున్నది. నీ వృత్తాంత మంతయు దెల్పినా శంకదీర్పుము.

మోహిని:- రాజా! స్త్రీలతో ముచ్చటించుటకు నిట్టి మిషల నన్వేషించుట మీ రాజధర్మమా? కాక మీ పురుష లక్షణమా? కాకున్న నేనెవరైన నేమి?

ఆమె మాటలకించుక ఖిన్నుఁడై కొంచెమాలోచించి "అబలా! ఏకాంతమున విహరించు నీయుదంతంబడుగ కోపగింతువేల? భీకరారణ్యంబున, క్రూరమృగ మధ్యంబున నొంటిగా నున్న నీకేమి ఇక్కట్టులొదవు నోయని, నీ యాపద బాప నుద్దేశించియడుగుట తప్పాయెనా? ఆర్తరక్షణలాలసులమగు మాకియ్యది ధర్మముగాక మరేమని భావించితివి? జాలి గుండెగల పురుషలక్షణముగాక మరేమనుకొంటివి?" అన మోహిని స్మితవదనయై యట్లయిన మీకు నా ధన్య వాదములు. ఇప్పుడు మీకు నా యుదంతము దెలుపుట కెట్టి సంశయమూ లేదు. నేను బ్రహ్మపుత్రికను. నన్ను భువన మోహినియందురు. మనోవాంఛా ఫలసిద్ధికై ఈశ్వరు నారాధింప వచ్చితిని. ఇదియే నా వృత్తాంతము.

ఆమె పలుకుల కమందానందకందళిత వదనార విందుడగుచు మనస్సు నందిట్లు యోచింపసాగెను. "ఈమె మాటలను బట్టిచూడ నవివాహితయనితోచుచున్నది. ఇట్లాలోచించి యామెతో మరల నిట్లు ప్రశ్నింపసాగెను. "రమణీ! నీ వీయుమాపతి నారాధించి, మెప్పించి. యేమికోరనుంటివో వినిపింతువా?". యన ఆమె ఇట్లనియెను. "రాజా! వినిపించిన కలుగు నష్టమేమున్నది? తగిన వరుని ప్రసాదింపుమనియే వేడు చుంటిని."

రుక్మాం:- ఎట్టివరుని?

మోహి:- నా యాజ్ఞకు బద్ధుఁడగువరుని

రుక్మాం:- ఇట్లేల గోరుచుంటివి?

మోహిని:- రాజా! స్త్రీలకుఁ బ్రపంచములో స్వాతంత్ర్యము శూన్యమయినదని మీకుఁ దెలియనిదిగాదు. ఇందులకుఁ గారణము పురుషుల కుటిల నీతియేయని తేలుచున్నది. పురుషుఁడెట్టి దుష్కార్యము లొనర్చుచుండినను స్త్రీ సహనశీలయై మెలంగవలెనని మోసగించినది పురుషులేగదా? అదియునుంగాక కాలక్రమమున పురుషుడు స్త్రీని దన విలాస వస్తువుగా భావింపసాగెను. అట్టియెడ నేనిట్టి వరమపేక్షించుటయం దాశ్చర్యమేమున్నది? శివుఁడు పరమ పూజ్యుఁడు ఆదర్శప్రాయుఁడు, పత్నియగు పార్వతికిఁ నర్ధ శరీర మిచ్చి యర్ధనారీశ్వరుఁడైనాఁడు. అట్టి దయామయుని నాకెట్టి ఇక్కట్టు లొదవకుండుటకై అర్థింప వచ్చితిని.

ఆమె మాటలకు రుక్మాంగదుఁడు చిరునవ్వు నవ్వి- గజగమనా! స్త్రీలకు సమాజమునందగ్రస్థానము లేదని పల్కుచుంటివా? అటులైన నీకు ననుభవము లేదని స్పష్టమగుచున్నది. స్త్రీ యర్ధాంగి యని ప్రసిద్ధికెక్కి - భర్తయశస్సును - పెంచుచున్నది. మాతృస్వరూపిణియై భూమాతను మరపించుచున్నది. స్త్రీలు సకల కష్టంబుల నెదుర్కొని ఉదారహృదయలై, యాదర్శప్రాయలై యుండకున్న లోకమెల్ల కల్లోలమైయుండగలదు. నీవనినట్లు పురుషులందును

గొందరు స్త్రీని విలాస వస్తువుగా భావింతురను కొందరు స్త్రీలయందును గొందరు భర్తల హేయ భావమున జూచువారు లేరందువా? అది నీకు సమ్మత మగునా? అట్టి స్త్రీ పురుషులను మనము తుచ్ఛులని భావింతుముగాక. ఇక స్త్రీకి సమాజములో సగ్ర స్థానము లేకపోవుటేమి. స్త్రీ పురుషులనియు, వధూ వరులనియు, తల్లిదండ్రులనియు, పలుకుటలోనగ్రస్థాన మెవ్వరిదో యూహించుము. సమాజ మెప్పుడును స్త్రీని ముందుచుంచుకొనియే పూజించుచున్నది. నీవు భ్రమ జెంది పురుషులనందరిని నిందింపవలదు.

అట్లు గాంభీర్యముగా దర్క పూర్వకముగా నుడివిన రుక్మాంగదునికి బ్రత్యుత్తర మిడ నామెకడ దగిన యుదాహరణ లేకపోయినను స్త్రీ చాతుర్యమును మాత్ర మిట్లు వినియోగించెను.

మోహి- మహారాజా! ఇట్టి పాండితీ పటిమతో స్త్రీల వశపఱచుకొను శక్తి పురుషుల కుగ్గుపాలతో నమరియుండును నా కిదంతయు నెందులకు నాయాజ్ఞకు బద్ధుడగు మోహ నాంగునే వరించి సుఖింతు. ఇదియే నా మనోవాంఛ.

రుక్మా- అబ్జనేత్రీ! ఇంతవఱకట్టి యదృష్టవంతు, డెవడో నిర్ణయము కాలేదా?

మోహి- లేదు. సుందరాంగుడు, సకలైశ్వర్యసంప న్నుడు, మదీయాజ్ఞానువర్తి లభించి నప్పుడు నిర్ణయమగును.

మోహజాలమున నంతకుమున్నే పడియున్న రాజామె మాటలకు నాసుందరాంగిపై లాలసుడై- "శశివదనా! నేనే నీకోర్కె నెరవేర్ప సంకల్పించితిని. సమ్మతించి సకలైశ్వర్యము లను భవింపుము."

మోహి- మహాభాగా! అందుకు దగిన ప్రమాణము చేయుడు.

వడ్లగింజల కాశించి వలయందు జిక్కిన పావురము వలె ముందు వెనుక లాలోచింపక సూర్యచంద్రాదులు సాక్షులుగ ఆమె యాజ్ఞకు కట్టువడుదునని ప్రతినజేసెను. తదుపరి వారు గాంధర్వ వివాహమాడిరి.

నవమోహనాంగి జగన్మోహిని నాకు లభ్యమైనదని రుక్మాంగదుడు, మహీపతి నా పతియయ్యె, మనోవాంఛ సఫలమయ్యెనని మోహిని లోలోన సంతసించిరి. పిమ్మట వారిరువురు విదిశానగరమునకు బయలుదేరిరి. ముండ్లపొద లతో నాగజెముడు గుట్టలతో నిండిన యరణ్యంబుదాటియొక సురమ్యయుద్యానవనంబు ప్రవేశించిరి. అందలి పూలు పుష్పొడి వెదజల్లుచుండెను. ఆనందపరవశులగుచు వారిరువురు నడువసాగిరి.

నడకముందుకు సాగినది. వెలుగు నీడల యందు కాలిడుచు మోహిని రుక్మాంగదునితో "నాథా! నవదంపతులు ప్రథమమున కష్టపడిన తదుపరి సుఖింతురనియు మొదట సుఖించిన చివర కష్టములనుభవింతురందురు. సంసారమను నది యొక సాగరమనియు, దానిని తరించుట పురుషునియు కి

శక్తులపై నాధారపడి యుండునని దలంతును. మందస్మిత వదనుడై రుక్మాంగదుడు. "ప్రియురాలా! సంసార సాగరం బున నావ నడుపు బాధ్యత ఒక్క పురుషునదేయననేల? సంసార నౌక యొక్క చుక్కాని చక్కగా సతి త్రిప్పుకున్న పతి నావనడుపజాలడు. అందు భార్యా భర్తల సామర్థ్యము సమముగా నున్నచో అనాయాసముగ సంసార సాగరమును తరింప వచ్చును. ఇక సుఖ దుఃఖముల మాటఁ దెల్పెద వినుము.

అమావాస్య లేనిదే పూర్ణిమ నేత్రోత్సవమొనర్పదు. పూర్ణిమ గాంచనిదే యమావాస్య యసహ్యమనిపింపదు. ఎండననుభ వింపనిదే చల్లని వెన్నెల యుల్లమును రంజింపదు. చంద్రికానుభవములేనిదే సూర్యరశ్మి వేడియనుకొనరు. వడ గాలిసోకనిదే పైరుగాలికి వరవశించిపోవరు. అటులే మాన వులు దుఃఖమసహ్యకరమని భావించుచున్నారు. కేవలము సుఖమే కలిగిన దుఃఖమును గుర్తింపజాలరు. కేవలము దుఃఖమే కలిగిన సుఖానుభవమెటుల గలుగును? అందులకే విధాత లోకమంతటను ద్వంద్వానుభవమును నెలకొల్పె. వేయేల? మానవ జీవితము సుఖదుఃఖముల కలయికతోనే శోభింపగలదు. మన మింతకు మున్ను ముండ్లపొదలను దాటి వచ్చితిమి గదా-అది యెంత యసహ్యమనిపించెనో యీ సుందరోద్యాన వనమంత మనోజ్ఞముగానున్నది. అటులే మనుజుడొక చెడుగును గుర్తించియే మరియొక సుఖానుభవ మును గుర్తించుచున్నాడు." అని సుఖదుఃఖములయందలి పరమార్థమును విశదీకరింప, మోహిని రుక్మాంగదుని వివేక

మనసున అచ్చెరువంది, లోలోన మెచ్చుకొనుచు, దానిట్టి మహాత్మ్యవంచింపయత్నింప వలసివచ్చెగదాయని తన్నుదా దిట్టికొనుచు విషాద భరితయై నీరసముగా నడుగుల లెక్కింప దొడగె.

కళావిహీనమైన మోహిని మోము నీక్షించి-"ప్రియురాలా! సుందర శశిబింబము నిరసింపగల నీ నెమ్మోమింతలో కేతు గ్రస్త చంద్రబింబమోయన కళావిహీనమైనదేమి?" అని రుక్మాంగదుఁడు ప్రశ్నింప, "నాథా! అధిక గమనము వలన పాదములు డస్సినవి. శరీరమంతయు బాధగా నున్నదని సమాధానమిచ్చెను. ఆమె మర్మ భావమును గ్రహింప జాలక రుక్మాంగదుఁడు," మనమిట కొంచెము విశ్రమించి శ్రమవాపు కొందమని వటచ్ఛాయ కరిగిరి.

రాజభవనమున ధర్మాంగదుఁడు తనతండ్రి మరునటి దినంబునకును తిరిగిరానందుకు మిగుల వ్యాకులపడెను. నాన్నగారు నడవలేకపోయిరేమోయని తలంచి పల్లకిమోసెడి బోయీల వెంటనిడుకొని, తానశ్వారూఢుఁడై బయలు దేరెను. కొంత దూరము వచ్చుసరికి తన తండ్రియగు రుక్మాంగదుఁడొక తరుణితో మాటాడుచు తరుచ్ఛాయ నాసీనుఁడై కన్పించెను. ధర్మాంగదునకు మొదట - ఆశ్చర్యము కలిగినను మనస్సును పదిల పఱచుకొని సమీపమునకేగి వినమ్రుఁడై- "పితృదేవ

లకు నమస్సు"లనెను. వెంటనే మోహిని 'నాథా!' 'తండ్రీ!' యని సంబోధించిన యీ నవయౌవనాంగుఁడెవ్వ?"డని ప్రశ్నింప నావంశోద్ధారకుఁడగు పుత్త్రుఁడని రుక్మాంగదుఁడు చెప్పెను. మోహిని యాందోళిత వదనయై "ఏమీ! మీరింతకు ముందే వివాహితులా? మీకుఁ బట్టపుదేవి గలదని యింతకు ముందేల తెలుపరైరి?" అని ప్రశ్నింప, రుక్మాంగదుఁడు చిరునవ్వునవ్వుచు "రమణీ! నీ వడిగిన గదా నే చెప్పుట ఇందు నా తప్పేమియు లేదు. ఇందులకు నీవును చింతింపవలదు. నీకెట్టి ముప్పువాటిల్లదు. భర్తృపాద సేవా పరాయణయగు సంధ్యావతి నిన్ను సపత్నిగా భావింపక చెల్లెలికన్న మిన్నగా నాదరించును." అని తెల్పమోహిని మౌనము వహించెను.



వారి సంభాషణ ననుసరించి ధర్మాంగదుఁ డంతయు గ్రహించి "తల్లి దండ్రులారా! ప్రొద్దుగ్రుంకుచున్నది; పల్లకి యందాసీనులు గండు," అనిన వారందు నాసీనులైరి. ధర్మాంగదుఁ డశ్వారూఢుఁ డయ్యెను. బోయీలు పల్లకి మోయుచు, పాటబాడుచు పరుగువెట్టిరి.



కొంతసేపటి కందరు రాజధానిం ప్రవేశించిరి. మోహిని నొక భర్మహర్మ్య మందుంచిరి. అనేక దాసీల నుంచి ధర్మాంగదుఁ డందే యుండసాగెను. వేయేల! ఆ కోమలి పరిష్వంగమే సర్వస్వమన్నట్లు రాసకార్యములు సయితము మఱచిపోయెను.

ధర్మాంగదుఁ డందుల కేమియుఁ జింతింపక ప్రతి కార్యంబున మంత్రుల సలహాల నందుకొనుచు జాగరూకుఁడై సర్వకార్యంబులఁ జక్క బెట్టుచుండెను. సుగుణ సంపన్నుఁ డగు పుత్రు డున్న తండ్రి కెందును కొఱంతరాదు గదా!

రుక్మాంగదుఁడు మోహిని కోరికల నెరవేర్చుచు నామె వద్దనే యుండసాగెను. మోహిని తృప్తిచెందక సంధ్యావతిని దాసి నొనర్పుమని కోరెను. కామాంధుఁడైన రుక్మాంగదుఁ డంగీకరింప సంధ్యావతి సంతోషముతో సవతి కూడిగ మొనర్పసాగెను.

ఇట్లు మోహిని యందున్న ప్రేమాతిశయముచేత ఏకాదశి వ్రతమును గూడ మఱచిపోయెను. ఐనను ధర్మాంగదుని వంటి సుపుత్త్రుఁడున్న నా రాజు కేల కీడు వాటిల్లును? ధర్మాంగదుఁడు వ్రత మొనర్ప సంకల్పించి దేశ మంతట వార్త ప్రకటించెను. పట్టణ మందొకడు ఢక్క మ్రోగించుచు -"ఎల్లుండి - ఏకాదశి పండగ బతం - యావన్మంది చేయవలసిందిహో!" యని కేక వేయుచుండెను. ఈ శబ్దములు చెవిని పడినంతనే రుక్మాంగదుఁడు, తన యవివేకమునకుఁ జింతించి ధర్మాంగదుని ధర్మ పరాయణతకు సంతసించుచు, తన కట్టి సుపుత్త్రునొసంగిన పరాత్పరునకుఁ బ్రణమిల్లుచు ముద్దుగుమ్మ యగు మోహిని కడకేగెను.

౮

నిలువు టద్దము ముందు నిలుచుండి మోహిని రత్నాభరణములను గంఠమున సరిజేసికొనుచుండెను. ఇంతలో పాద సంచలనమున ధ్వనిగని భర్తరాక గ్రహించి, "మనోహరా సంధ్యావతి సంపెంగ దండ గట్టినదా? యని ప్రశ్నింప! రుక్మాంగదుడు "బేలా! అలంకరణతోఁ బ్రొద్దుఁ బుచ్చుచు నవ్యయుఁడనంతుఁడాపద్బాంధవుఁడగు పరమాత్మను మఱచుచున్నాము. మనవంటి మూర్ఖులు జగత్తున గలరా? ఈతుచ్ఛ సుఖములన్నియు క్షణ భంగురములు. మనదేహములు మంటికుండల వంటివి. తుచ్ఛ సుఖములకై సదాచారమును మరచు నంతటి మూర్ఖుడనైతిని. నేటికి గ్రహించితిని. ఎల్లుండి ఏకాదశి పర్వదినము. రేపు ఒంటిపూట భోజనము. ఎల్లుండి యుపవాస దీక్షతోఁ నిష్కామ కర్మతో నందరును భగవాను నారాధింతురు. ఇది నియమమగు వ్రతము. ద్వాదశినాఁడు బంధుమిత్రులతోఁ గలసి పారణ మొనర్పవలెను. అంత దనుక యెవ్వరికి పనులఁ జేయనాజ్ఞాపించక నీ విశ్వకార్యమందు పాల్గొనుచు నన్ను సంతుష్టుఁ జేయుమన, మోహిని భృకుటి కటాక్ష మొనర్చుచు, "ఏమీ! నేటికే నాటిమాటలమఱచిరి కాబోలు! మీ యాజ్ఞకు బద్ధురాలను కావలయు ననియా మీ సంకల్పము? నీ మాట, జవదాట నని ప్రతినజేసి, వివాహమాడి - నేడు ఏకాదశి యనియు యోగినై పోవుదు ననియు నుడవుచున్నారా? ఏకాదశి నాడుపవాసమట, ద్వాదశినాఁడు పారణమట-మంటికుండతో సమానులమట! భళా! మట్టికుండపై మమకారమేల కలిగె? యోగివి

కావలెననియున్న నన్నేల పరిణయమాడితిరి? యువాహ మనగా-స్త్రీని సువర్ణ శృంఖలముల బంధించుట యనుకొంటిరా? ఇట్లే మీపురుషులు నాటినుండి నేటి వఱకు మా స్త్రీజాతి నాడించుచువచ్చిరి. కాని మోహినిముందు మీ యాటసాగదు. మీ సత్యవ్రతము నేటికిఁజక్కఁగా బోధపడినది. ఇదుగో! నామాట వినుఁడు-సత్యవచనమును పాటింతురా- నాయాజ్ఞకు బద్ధులైయుండుఁడు. అవ్రతమూఁడ దలంతురా-మీయిష్టం." అని పెడముఖము బెట్టికొనెను.

ఆమె పెంకితనమునకుఁ జింతించుచు- "శైలా! నీకీ వ్రతవిషయంబున నింత విముఖత్వం శేఁకలిగె?" నని రుక్మాంగదుఁడు ప్రశ్నింప, "రాజా! స్త్రీలకును పురుషుల వలె తెలివియుండునని తలంచుము. మగవారి నిచ్చవచ్చినట్లు పిచ్చిపనులఁజేయించుటకు స్త్రీ లందరు బుద్ధిహీనులుగారు. పనులుమాని వ్రతములొనర్చుటకు నేనొప్పను. ఇటులే కొంత కాలము వ్రతము లొనర్చుచుండిన దేశమంతట సోమరులు, తిండిపోతులు వృద్ధియగుదురే కాని జేయ వారుండరు. భావి సతంతి- "రాజంత బుద్ధిహీనుఁడైన రాణియుఁబిచ్చిదై పోయెనా!" యని పరిహసింతురు. లోకాపవాదము దప్పించుకొన నేనిట్లు కోరుచుంటినని తెలిసికొనుఁడు. కనుక దాసదాసీలు పనిచేయుచుండ వలసినదే. మీ వలన నేమనియు నెగ్గదని భయపడకుఁడు. అనాయాసముగా నన్ని పనుల నేనే సమకూర్చగలను. ఇక మీరు నా యంతఃపురమున హాయిగా నానంద మనుభవింపుఁడు. తాఁజెడ్డకోతి వనమెల్లఁ

జెరిచినట్లు మీతోఁబాటు ప్రజలఁ బిచ్చివారల జేయకుఁడు. ఇది నా యాజ్ఞగా భావింపుఁడు" అని మౌనము వహించెను.

ఆమె వ్యతిరేక ప్రత్యుత్తరమునకుఁ జింతించుచు "గాంతా ! నీ యూహ సరిగాలేదు. ఈ వ్రతమువలన దేశము సుభిక్షముగా నుండునేగాని కాటకమునకు గురికాదు. ఈ పర్వదినము వత్సరమున కొకసారే వచ్చును. ఆనందమును నాత్మపరిశుద్ధిని గలిగించునట్టి యిద్దినంబును గూడా మఱచి లౌకిక కార్యములలో నిమగ్నులయిన ప్రాణికోటికి నుల్లాసమెట్లు చేకూరును ? అదియునుంగాక యేకాదశి దినంబున నా యేక పుత్రునికన్నా మిన్నగా ప్రేమించుచున్నాను. ఇది నా జీవిత పరమలక్ష్యము. దీనిని విఘ్నమొనర్చి పాపము మూటగట్టికొనకు" యన మోహిని వికటహాసముతో "రాజా ! నా కిచ్చిన మాట దక్కించుకొనక మీరే పాపమును మూటగట్టుకొననున్నారు. కాని నా కేమియు పాపమురాదు. పుత్రునికన్న ఏకాదశి వ్రతంబును నెక్కువగాఁ బ్రేమింతుననుచున్నారు. ఆ మాట నాకు నచ్చదు. నేను ఒప్పుకొనను. భార్యాద్వయముకన్న మిక్కిలి ప్రేమింతునన్నచో నమ్మియుండెడిదానను. ఐనా మీ మాట కాదననేల ? పుత్రునికన్న ఏకాదశివ్రతము నెక్కుడుగాఁ బ్రేమించు ననుటలో నొకవేళ పుత్రునైన త్యజింపవలసిన త్యజింతుగాని, ఏకాదశి వ్రతము త్యజింపజాల నన్నట్లుగా నర్థము స్పష్టమగుచున్నది. అటులైన న్యాయముగా మీ ఖడ్గమున మీ పుత్రుని ఖండించి వ్రతమొనర్పుడు. లేదా వ్రతముమాని సుఖింపుఁడు" అని కర్ణకఠోరముగా బల్కెను.

ఆ దురంత దుర్భర విషమిశ్రిత వాక్యములకు రుక్మాంగదుడు మూర్ఛితుఁడయ్యెను. సేవకులు రుక్మాంగదుని శరీరముపై పొంగివచ్చు స్వేదబిందువులఁ దుడిచి వీవనల విసరసాగిరి. కొంతసేపటికి మోహినివైపు దీనముగా జూచుచు— "నాకీ ! నాపై నీకేల గలిగె నీ కసి ? ఇట్టి విషమ పరీక్ష వలన నీ కొదవు మేలెద్ది ? సుగుణ ఖనియగు ధర్మాంగదుడు నీకే యపకారమొనర్చె ? నీ కిట్టి దుర్బుద్ధి బుట్టునని కలనైనా దలపనైతినే ! కోమల హృదయియగు మహిళామణి యనుకొంటిగాని, కఠిన కర్కశమైన కామిని యనుకొననైతినే ? మాలిన్య మిసుమంతయు లేక మిల మిల మెరయుచున్న ద్రాక్షునకుఁ గోరన విషముంచినట్లు, అందచందములతో నలరారు పులిని సృష్టించి హింసకుఁ బ్రోత్సహించినట్లు నిన్నును బాహ్యమున నందముగా సృజించి, క్రూరస్వభావినిగా చేసివైచిన బ్రహ్మ నేమనవచ్చు ? సకలసద్గుణ సంపన్నుడగు ధర్మాంగదుఁడు నీ కెట్టికీడు జేసె ? నీ కిట్టి వాంఛయేల కలిగె ? అయ్యో ! లేకలేక కలిగిన కుమారుని ఖడ్గమున కెరసేయుటెట్లు ? పరాత్పరా ! ఏకాదశి వ్రతమొనర్చు భక్తునికిట్టి యిక్కట్టు గల్పించితివా ? వెనుక గోయి ముందు నుయ్యిగా నున్నది. ఏది తెఱవు ? ఈ దుష్టురాలి మూలమున సర్వనాశనము గానున్న"దని చింతింపసాగెను.

## ౬

ఈ దుర్వార్త కొలది నిమిషములలోఁ బట్టణమెల్ల వ్యాపించెను. రాజుగాయొక్క కులక్షయమునకీ రాకాసియే కారణమని కొందఱు, విధి విపరీతము కాకున్న యిట్టి మోహనాంగి, మనమోహిని నోటినుండి యిట్టి విపత్కరమగు మాటలేల వెలువడును ? యని కొందరు, సకల సద్గుణవతి యగు పత్ని యలరారుచుండ ద్వితీయకాంతను బరిణయ మాడి తగినశాస్తి పొందెనని కొందఱు, ఎట్టి నిష్ఠాగరిష్ఠుఁడైనను నొకప్పు డిందువదనల మోహించి విపత్కర పరిస్థితుల నెదుర్కొనవలసి వచ్చునుగదా ! యని కొందఱు, అలనాఁడంతటి తపస్సంపన్నుఁడైన విశ్వామిత్రుడే మేనకను మోహించి తపఃఫలము కోల్పోవ మనము రేనిని దూరుడ తగదని కొందఱు, స్త్రీల పెత్తనమువలన నిట్టి దుస్థితి కలుగునని కొందఱు, గుమిగూడి గుసగుసలాడసాగిరి.

ధర్మాంగదుఁడు దశమినాఁటి ప్రాతఃకాలమున ముఖప్రక్షాళన మొనర్చుచుండ చారులరుదెంచి మోహిని కోరికను, రుక్మాంగదుని స్థితిని దెల్పిరి. ఆ మాటలు వినినంతనే హుటాహుటి తండ్రి నూఱడింప ధర్మాంగదుఁడు మోహిని సౌధంబున కఱుగ, రామాభిషేక సమయమున కైక మందిరమున పడిపోయిన దశరథునికథ జ్ఞప్తికి వచ్చెను. కాని కైక స్వపుత్ర సుఖాభిలాషిణియై యట్లొనర్చె, నిట్టి కోర్కె పినతల్లి యేల కోరెనో తెలియక "స్త్రీబుద్ధిః ప్రళయాంతకః" యను నానోక్తిని జ్ఞప్తికి దెచ్చుకొని, యేమైననుదండ్రిగారి

సత్యవ్రతమును సంరక్షింప సంకల్పించి తండ్రి పాదద్వయ మంటి నమస్కరించెను.

రుక్మాంగదుఁడు కుమారుని లేవనెత్తి హృదయమునకు హత్తుకొనెను. కొమరుని భక్తివినయములకు సంతసించియో లేక ఏకాదశి వ్రతమంతరించుటకు మోహిని పలికిన దుర్భర వచనములకో రుక్మాంగదుని కన్నులు చెమ్మగిల్లెను.

అంతట ధర్మాంగదుఁడు తండ్రితో నిట్లనెను- "తండ్రీ! చారులవలన విషయమంతయు వింటిని. ఇందులకు మీరావంతయు జింతింపవలదు. పినతల్లి యెంతయో సుగుణవతి సుమీ! కాకున్న ఏకాదశీ వ్రతమునే ఆపమన్నచో మీ రామె కోర్కె చెల్లింపవలసి వచ్చెడిది. అట్లు జరిగినచో మన నిష్టకే ముప్పు వాటిల్లెడిది. దానికి బదులు నా శిరచ్ఛేదనము కోరినది. ఇది యామె సహృదయతకు తగిన కోరిక. ఏకాదశి మన సదాచారమునకు సంబంధించినది. సదాచారము నశించినచో సర్వము నశించినట్లే యగును. కనుక నా శిరచ్ఛేదన మవశ్యము జరుగవలయును. అదిగాక ఏకాదశి దినంబున మరణము పరమ పదవికిఁ జక్కని బాట. కనుక రేపటి దినంబున నన్ను వధించి వ్రతమొనర్చి మీ సత్యవాక్కును నిలుపుకొనుడు. ఇదియే నా ప్రార్థన యని ముకుళిత హస్తుఁడై నిలిచెను.

కొమరుని మాటలకు రుక్మాంగదుఁ డెంతయో విలపించుచు "నాయనా! కన్నకుమారుడవగు నిన్ను జంపఁ

జేతు లెట్లాడురా ! ఏ హస్తంబుల నిన్నెత్తికొని ముద్దాడి, మురిసిపోయితినో ఆ చేతులతో నిట్టి దుష్కార్యమొనర్పం జేతు లెట్లాడురా ! మున్నెన్నడైన, ఎవ్వడైన ఇటు లొనర్చెనా ? ఈ మూర్ఖురాలి మూలమున నెట్టి దుస్థితి సంభవించె" నని విలపించుచుండ, తండ్రితో ధర్మాంగదుడు డిట్లు దెల్పసాగెను. "తండ్రీ ! ధైర్యము వహింపుడు. సర్వ మెఱింగిన మీకు బోధింప నే నెంతవాడను ? మృత్యువు నకు భీతిల్లుట యెంత వెఱ్ఱియో యూహింపజాలకున్నారు. జన్మించిన ప్రతి ప్రాణికి మృత్యువు దప్పదు. అదియొక సత్కార్యమునకు వినియోగపడుట శుభమేయగును. అది యునుగాక మృత్యువు శరీరమునకే కాని ఆత్మకుకాదు. ఆత్మకు శరీర విసర్జనము పాము కుబుసమును వదలు విధము గనే యుండును. కుబుసమువీడి పాము పరితపించనట్లు ఆత్మ శరీరమును త్యజించి దుఃఖించదు.* మనుష్యుడు మురికిబట్టను వీడి శుభ్రవస్త్రమును ధరించినట్లుగా నాత్మ క్రొత్తశరీర మును ధరించును. కావున చింతవలదు. భగవంతునిపై భారమువైచి మీరీపని గావింపుడు" అనిన విని రుక్మాం గదుడు మనమందు "దుష్టశిక్షణ, శిష్టరక్షణ మొనర్చు భగవానుడీ భక్తునెట్లు రక్షించునో చూడవలసి యున్నది. సత్యవాక్పరిపాలనకు సదాచార రక్షణకీకార్యము జరిగితీర వలసినదే. కుమారు వచనము లవశ్యాదరణీయములు" అని

* వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవానిదేహీ. (గీత)

నిశ్చయించి "వత్సా ! అట్లే యొనర్చి ఏకాదశివ్రతము కొనసాగింతును. రేపటి యుషఃకాలమున వధ్యస్థానము కడనే వ్రతముగూడ జరుప సంసిద్ధ పరుపుము. అని తండ్రి పలుక నేడుగదా నా జన్మ ధన్యమైనది ! ఎవ్వఁడు ధర్మరక్షణార్థము, పితృవాక్పరిపాలన నిమిత్తము మరణించునో వాని జన్మము ధన్యమగును. చరితార్థమగును. అదియునుగాక ఏకాదశి మరణము నాకు సుకృత వశమున లభ్యమగుచున్నది. ధన్యోస్మి. ధన్యోస్మి !" యనుచు నుత్సాహముతో వ్రత సన్నాహ మొనర్ప వెడలిపోయెను. అట్టి సమయమున విదిశా నగర పరిస్థితి యెటులుండెనన :—

సీ॥ కాంతుండు కొమరుని ఖండించు ననివిని
తల్లి సంధ్యావతి తల్లడిలగ,
పెనిమిటి దివికేంక చనునని వినినంత
తల మోదుకొని పత్ని తల్లడిల్ల,
చెలికాని మరణంబు తొలగింపలేమని
మిత్రుల దుఃఖాగ్ని మిగుల బొగుల,
ధర్మాంగదుని చావు దారుణంబని యెంచి
ఎలుగెత్తి జనులెల్ల యేడ్చుచుండ,

తే॥ గీ॥ సకల సద్గుణ సంధాత చనునటంచు
వంతజెందుచునుండ భూవలయమెల్ల
వచ్చుచున్నాఁడు సుగుణ సంపన్నుఁడనుచు
సంతసముతోడ బొంగెను స్వర్గమెల్ల !

"ధర్మసంరక్షకుఁడును, దయామయుఁడగు యువరాజు ధర్మాంగదుఁడు నేటితో మరణించును గాబోలు—అకటా! తల్లియగు సంధ్యావతి యీ దుఃఖసాగర మెట్లీదగలదు? భార్యయగు చంద్రరేఖ యీ చిర వియోగ మెట్లు సహించును? మున్ను భార్గవరాముఁడు తండ్రియానతి పాటించి తల్లితల గొడ్డట ద్రెవ్వనేసె ననియు, శ్రీరాముఁడు దండ్రి యానతి మీరక యడవుల కరిగె ననియు. యయాతికిఁ దనయుఁడు తన యౌవన మొసంగెననియు, భీష్ముఁడు దండ్రి మన్కువ సెల్లింప బ్రహ్మచర్యము గైకొనెననియు విని యుంటిమే కాని, తండ్రియొక్క సత్య సంరక్షణార్థము, సదాచార పరిరక్షణకు స్వయముగా స్వచ్ఛంద మరణ మాకాంక్షించిన మహాత్ము నే చరిత్రయందైన విని కని యెఱుంగము కదా? ఇక నిట్టి మహాత్ముఁ జూడగలమా?" యని మానవులెల్లరు చింతించుచుండ; "బహుదినంబుల నుండియుఁ బుణ్యాత్ములెవ్వరును స్వర్గమునకు జనుదెంచక మర్త్యలోకమందే మనుచున్నారు. నేటికి నాకలోకంబునకుఁ బుణ్యాత్ముఁ డొకడు రానున్నాఁడు. ఇఁక స్వర్గలోకము వెనుకటివలె కళకళలాడుట కిక్కార్యమె నాందికావచ్చును" అని పలుతెఱంగు లమరులు- అమందానంద భరితులై యాకసంబున విమానంబులతో నదృశ్యాకారులై విహరించుచు వీక్షించు చుండిరి.

౭

పందిళ్ళు, తోరణములు, పుష్పాలు, పండ్లు, వివిధ సుగంధ ద్రవ్యములు, వ్రతమునకు వలయు పరికరములు దృగ్గోచర మగుచుండ, నచటనే వధ్యవేదిక, చెంతనొక ఖడ్గము మిలమిల మెరయుచుండెను. సుగంధము పంచి లోక మంతటికి ఆరోగ్య భాగ్యమొసంగు చందన వృక్షమునకుఁ త్రాఁచుపాము జుట్టియున్నట్లు వ్రతమొనర్చు స్థలంబున ఖడ్గము కనిపించుచుండెను. రుక్మాంగదుఁడు గంభీర వదనముతో నచ్చోట గూర్చొనియుండెను. ఇంతలో ధర్మాంగదుఁడు అచ్చటి కరుదెంచి వేదికపైకెక్కి ప్రజల కభిముఖుఁడై ఇట్లు చెప్పదొడంగెను :-

"పౌరులారా! చింతించకుడు. నా తండ్రి సత్యమును నిల్పుటకును, ఏకాదశి వ్రతము నిర్విఘ్నముగా నెఱవేఱుటకును, నేను నా దేహమువీడనుంటిని. మీస్మృతి పథంబున కలకాలము జీవించు నాకు మరణ మెక్కడిది? ఇతిహాసంబున నా నామంబు ధ్రువతారవలె నిలచియుండును. కాన సంతోషముతో మీరెల్లరు వ్రతమొనర్పుడు"

కాననమున వాన కురిసి యాగిన వెంటనే నిశ్శబ్దత యేర్పడినట్లు, అగణిత జనసందోహము యొక్క దృగ్జలము వర్షించి వర్షించి యాగిపోగ మనుజలందఱు మౌనము వహించి వినుచు నూఱకుండిరి.

ధర్మాంగదుడు మౌనప్రార్థన మవలంబించెను. ఇంతలో సంధ్యావతి దుఃఖముతో నచటి కరుదెంచెను. ఆమెనుజూసి

ప్రజలు యెంతయో చింతించసాగిరి. ధర్మాంగదుని యేకా
గ్రతకు భంగము వాటిల్లెను. అంతట కన్నుల విప్పి తల్లి
వైపుజూచి ధర్మాంగదుడు-ఇట్లు చెప్పదొడగెను: "తల్లీ! దుఃఖ
ముడుగుము. పితృవాక్పరి పాలనం బొనర్చుటే నా కర్త
వ్యము. అట్లొనర్చి నా నామంబు సార్థక మొనర్చు కొన
నిమ్ము. తండ్రికపకీర్తి గలిగించు పుత్త్రుడు పుట్టకుండుటయే
మేలు. తండ్రికి యశమొసంగ మరణించిన మానవుడే పునీ
తుడగును. ఆతడు మృతజీవుడై ఖ్యాతినందును. నీవుచింతిం
పవలదు. తల్లివగు నీకిట్టినీతి చెలుప సాహసించి నందులకు
నన్ను మన్నింపుము." అని నుడువ సంధ్యావతి పుత్త్రుని
కౌగలించు కొని "నాయనా! నీలాంటి బుద్ధిమంతున కిది
సహజవాంఛయే కాని, లేక లేక కలిగిన నిన్ను వధించుకొని
మే మనుభవించు కైవల్యమేమి? ఆయ్యో! శిరీష కోమల
గాత్రియగు చంద్రరేఖ దుఃఖాతిశయమున నంతఃపురమ్మున
స్పృహదప్పి పడియున్నది. మానినీ మణియగు నీ ఇల్లాలి
కొరకైన మానుండి దూరముగావద్దు పుత్రా! యిదియే నా
హితబోధ" అనిన విని ధర్మాంగదుడు మరల మా తకు
మధురవచనంబులు దెలుపసాగె. తల్లీ! ఇట్లు తెలియని దాని
వలె పలికిన నే నేమనువాడను! మున్ను పతిమాట కొరకై
సతీమణులు సల్పిన కర్తవ్యము నూహించుకొనుము. వీర
నారీమణుల కర్తవ్యమునే పాలించుమని చంద్రశేఖకు
దెల్పుము. పతివ్రతల కింతకన్న దెల్పవలసిన దేముండును?
మానధనులు మాట తిరుగరని శాస్త్రములు ఘోషించు
చున్నవి. మా తండ్రి యుద్యమమున కంతరాయము గలిగిం

ప్రయత్నింపకుము. ఇంతకన్న వేరుగా దెల్పజాల"నని యూర కుండెను. కుమారుని దృఢవచనంబులకు నామె బదులు తెల్ప జాలకపోయెను. కాని అధిక శోకాయాసమున స్పృహదప్పి పడిపోవ సేవకు లామె నంతఃపురంబునకు జేర్చి పరిచర్య లొనర్పసాగిరి.

౭

అది వైకుంఠము, విరజానదీతటము. అచట కల్పతరు చ్ఛాయన శ్రీరమతో శ్రీహరి ముచ్చటించుచుండెను.

రమ:- నాధా! జగద్బాంధవా! కైలాసంబున పార్వతికి బర మేశ్వరుడెన్నియో యద్భుత కథల దెలుచుండ మీ రొక్క విషయంబైన దెల్పరైరి. సతులకు సంతస మొనర్చుటే పతుల ధర్మముగదా! కావున నో దేవా! మీ కేరియందనురాగముగలదో వారిం గూర్చి తెల్పి నన్నానందాబ్ధి నోలలాడింతురని ప్రార్థింతు.

శ్రీహరి :- దేవి ! సతత భక్తితత్పరవై నా సేవ సల్పు. నీకు దెలియని దేమియుండును ? ఐనను నడుగు చుంటివిగాన దెల్పెద నాలకింపుము. నిన్నెవ్వరు భక్తితో గొలుతురోవారినే నే ప్రేమింతును. కంటికి రెప్పవోలె వారిని గాపాడెదను. నన్ను నిందించినను సహింతుగాని, నా భక్తులకు గీడుసేయువారి శిక్షింతు. గజేంద్రుని రక్షించుట, ప్రహ్లాదుని గాపాడుట నీ

వెఱింగిన విషయము లేగదా ! అందులకే నన్ను భక్త వత్సలుఁడందురు. నా భక్తులఁ బీడింప వెడలుటయనిన దివ్వెను మ్రింగ వెడలు శలభములమాడ్కి నశించిపోవుటయే. ఇది ముమ్మాటికి నిజము.

రమ :- భక్తవత్సలా ! నా కొక్క సందేహము గలుగుచున్నది. అది యేమనిన నీ భక్తుని పీడించువాఁడును నీ భక్తుడే యగుచో వానినెట్లు గాపాడగలరు ?

శ్రీహరి :- ఇదియా నీ సందేహము ? నా భక్తుఁడై యుండియు నా భక్తుడైన మరియొకనిని పీడించెనేని వాని మనోమాలిన్యము వదలలేదని భావింపుము. తన యంతటివాఁడు లేఁడని తలంచి, గర్వించి ఇతరులపై దాడిచేసిన సహింపజాలను. తండ్రి తన పెద్ద కుమారుఁడు చిన్నకుమారునిపై చేయి చేసికొనిన నెట్లుబుద్ధి గఱపునో యటులే బలగర్వితులగు భక్తులకు నీతి నేర్పుటకు శిక్షింతును. నన్నాశ్రయించి యెవ్వఁడు చెడడు. ఇది నమ్మదగిన నిజము. మున్నొకప్పుడు నన్ను గొలుచుచు నేకాదశి వ్రతమొనరుచు భక్తుఁడైన యంబరీషునిపై నాగ్రహించి దుర్వాసమహర్షి తన మంత్ర శక్తితో భూతమును సృజించి ప్రయోగింప నంబరీషుడతి భక్తితో ధ్యానింపగా నాతని రక్షింప నేను శక్తిపై చక్రము ప్రయోగించితిని. చక్రాయుధము త్రుటిలో శక్తిని సంహరించి, దుర్వాసుని వెంబడించెను. అతఁడంతట కాలుగాలిన పిల్లివోలె సత్య

లోకంబునకు బరుగెత్తి త్రస్తతో మొర వెట్టికొనియె. బ్రహ్మదేవుడు "చక్రాయుధ మరికట్టు దిట్టతనము నా యందు లేదు. పరమేశ్వరు బ్రార్థింపుమని" తెల్ప, నాతడు కడు రయంబున కైలాసంబున కఱిగి కపర్ది బ్రార్థించె. పరమేశ్వరుడు చిరునవ్వునవ్వి, హరి చక్రం బాప నేను బ్రయత్నింపను. ఎందులకందువా? హరిభక్తులు నా భక్తులు, హరి శత్రువులు నా శత్రువులు. హరిహరులకు భేదమెంచువా రవివేకులు సుమా! నీవు నన్ను శరణు వేడితివి కాన నిన్నువీడి, నీ రక్షణోపాయంబెఱింగించెద వినుము. నీ విప్పుడు బిరబిర వైకుంఠమున కరిగి హరిని శరణు వేడుము. ఆతడు తప్పక రక్షించునని యె. చూచితివా! నా భక్తుడైనను గర్వించిన కతంబున నెట్టి యిక్కట్టుల పాలయ్యెనో. వేరు శరణ్యములేక దుర్వాసుడు నా పాదములపై బడి సుదర్శనల జ్వాలల గ్రక్కుచు నరుదెంచు చక్రంబును మరల్పు బ్రార్థించె. నా సంజ్ఞ గ్రహించి నా చక్రంబు శాంతించి, నా హస్తంబునధిష్టించె. అప్పటినుండి దుర్వాసుడు నిగర్వియై భక్తి తత్పరుడై నా ప్రేమకు పాత్రుడయ్యె. బలాఢ్యుడగు భక్తుడు బలహీనునిపై దాడిసల్పిన వానిని నేనే రక్షింతు.

రమ :- భక్తవత్సలా! నాకీ చరిత్ర తెలియదు. కావున దెలుప వేడుచున్నాను. ఆ సమయమున నే నెక్కడుంటిని? నిరుపమాన గుణనిధియగు నంబరీషునిపై

దుర్వాసుకఁ కంతటి కోపమేల కలిగె ? నాకుఁ దెలి యని చరిత్రగాన, విస్మయంబును, వినవలెనను కుతూ హలమును గలుగుచున్నవి. వివరించి తెల్ప ప్రార్థించుచుంటిని.

శ్రీహరి :- లక్ష్మీ ! చెప్పెడిమగవారల "వినిపింపుడు, విని పింపుడని" విడువక కోరుచుందురు గదా మగువలు. పార్వతి పరమేశ్వరునిట్లే పీడించుచు రామాయణ, పురాణేతిహాసంబుల జెప్పించుకొనుచుండును. గరళ కంధరు గతియే నాకును బట్టునేమోయని మొదటనే సందేహించి యుంటిని. అనుకొన్నది జరిగియే తీరినది. కాని యిప్పుడు నీ వడిగిన ప్రశ్నలకు మాత్రము సమాధాన మొసంగి ఇక ఎప్పటికిని నిట్టి సమస్య రాకుండా జాగరూకత వహించెద ఆలకింపుము. నిరం తరము నా పాదసేవా తత్పరవైన నీ కా సమయమున నిద్దుర వచ్చెను. త్రుటికాలమున నా పాదములచెంత తలవాల్చి, కనులు మూసితివి. మనకు త్రుటికాలము మానవులకు బహుకాలమగునుగదా ? అంబరీషుఁడను రాజపుంగవుఁడు నన్ను భక్తి నర్చించుచు, ఏటేటా ఏకాదశీవ్రత మాచరించుచుండెను. ఒక ఏకాదశి దినం బున తలవని తలంపుగా దుర్వాసుఁడను మహర్షి యంబరీషున కతిథియయ్యెను. దుర్వాసుఁడు మహర్షి యనియు, ముక్కోపియనియు, నసమాన ప్రతిభా

సంపన్నుఁడనియు నంబరీషునకుఁ దెలిసియున్నందున మనస్సునభయమందుచునతిథిసేయయందెట్టి లోపము రానీక నతి జాగరూకుఁడై మెలంగుచు, మఱుచటి దినంబు ద్వాదశి గావున పారణ మొనర్పరండని, ప్రార్థించె. అందులకు దుర్వాసమహర్షియు సమ్మతించి స్నానమొనర్చి వత్తునని నదికేగె. చాలసేపటి వరకు ముని రాకకై యంబరీషుఁ డెదురు చూచుచునే యుండెను. భూసురులు ద్వాదశి ఘడియలు దాటుచున్నవని తదుపరి భుజించిన ఫలముండదనియు పలుకసాగిరి. మహర్షికంటే ముందేల భుజింతు, పాపముగదా !'' యని రాజు సంకోశించసాగెను. అందులకు బ్రాహ్మణులు "పాలైనా త్రాగుడు పాపముండ''దని చెప్పిరి. వారి యానతి ననుసరించి యంబరీషుఁడు క్షీరము గ్రోలుచుండ దుర్వాసుడరుదెంచి తోకద్రొక్కిన త్రాసువలె మండిపడుచు, రాజాధమా ! నా యంత మహర్షిని బిలిచి యవమానించితివి. నా కన్న ముందుగఁ బాలుద్రాగి పొట్ట నింపుకొంటివి. మూఢుఁడా ! మునుల నవమానించిన ఫలమేమగునో యిూహించితివా ? నీ వెంత ? నీ వ్రతమెంత ! చూడు'' మని తన జటను బెరికి భూమిపై పడవేచి మంత్రింప నది పెనుభూతమై మంటలను గ్రక్కుచు నంబరీషుని మ్రింగవచ్చెను. వేరు శరణ్యములేక యంబరీషుఁడు నన్ను వేడుకొనెను.

అంతట భక్తరక్షణార్థమై నేను చక్రం బంపితిని. తదుపరి విషయము నీవు వినియేయుంటివి.

రమ :- ఆర్తత్రాణ పరాయణా ! శ్రీమన్నారాయణా ! మిమ్ము స్మరించి ధన్యులుకాని వారెవరున్నారు ? అత్యద్భుతమైన యీ కథవలన నాకమందానందము కలిగినది. ధన్యోస్మి !

ఇంతలో వెనుకనుండి హఠాత్తుగా "అట్టి నిర్భాగ్యులును- ఉన్నారు తల్లీ !" అను మాటలు వినిపించెను. లక్ష్మీనారాయణులు వెనుకకు జూడగా, కాళ్ళకు గజ్జెలును, కటినుండి బిగించి ధరించిన కాషాయాంబరమును, గళమందుఁ దులసిపేరులు, నొకచేత తాంబుర. నొకచేతఁ జిరుతలు గలిగి భాసమానమై మోము విలసిల్ల నారదమహర్షి నిలిచి యుండె.

రమ :- నారదా ! ఎక్కడినుండి వచ్చితివి ? ఏమి విశేషములు ? ఏమనుచుంటివి ? భగవానుని భజించియుఁ గష్టము లనుభవించెడి నిర్భాగ్యులుండిరనియా !"

నార :- తల్లీ ! మీ కా దీనారవము వినిపించుటలేదా ? సత్యవాక్పరిపాలన నిమిత్తము ఏకాదశీవ్రత సంరక్షణార్థము పరమ భాగవతోత్తముఁడగు రుక్మాంగదుడు కన్న సుతుని కరవాలమున కెరగావించుచున్నాడు. అందులకు-

సీ॥ దేవుఁడా ! యని బిట్టు బావురుమన్నది
తల్లి సంధ్యావళి తనయుఁ గొఱకు,
నారాయణా ! యని నట్టింటఁ బడిపోయె
ధర్మాంగదుని సతి ధవుని కొఱకు,
శ్రీహరీ ! యనివేడి చింతించుచుండిరి
మిత్రులెల్లరు రాజపుత్రు కొఱకు,
పరమాత్మ నెదనెంచి ప్రార్థించుచుండిరి
రైతులెల్ల యువరాజు కొఱకు.

తే॥ గీ॥ తల్లిరో ! శ్రీ మహావిష్ణుఁ దలచి తలచి
సుడివడక నున్నవారు మచ్చునకు లేరు,
కదలి ధర్మాంగదుని నేడు గావకున్న
నాస్తికత్వంబు జనులలో జాస్తియగును.

ఇటుల కమలాదేవి కెలఁకించి, శ్రీహరి నవలోకించి, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! ఆదిమధ్యాంతరహితా! అన్నియుం దెలసి యసలెఱుంగని వానివలె నటించుట ధర్మమగునా ? జాగుసేయక భక్తుల గాపాడుము. కాకున్న 'భక్తవత్సలు'డను నామంబెట్లు నిలువగలదు ? నీ భక్తాగ్రేసరుఁడిట్టి ఘాతుకచర్య గావించునేని, నీ భక్తుడగు ధర్మాంగదుఁడు మరణించునేని, నీ భక్తులెల్ల రిట్లే దుఃఖాబ్ధిలో మునుఁగుదురేని, ఇక నిన్ను దలచువారుండరు. ఇట్టి తరి యెందుకుపేక్షించితో నాకు దెలియకున్నది. కారణమేదైన కలదేని తెలుపవేడుచున్నాను.

శ్రీహరి :- నారదా ! భక్తులనెడి బంగారు నాణెములను, దుష్టులనియెడి గీటురాలపై పరీక్షింతు. సువర్ణమగ్నియందు కాలినకొలది కాంతితో ప్రకాశించునట్లు నా భక్తులు గష్టములు సహించి సహించి తుదకుఁ దమ కీర్తి కౌముదిని వెదజల్లుదురు. రుక్మాంగదుఁడిపుడు నా పరీక్షయందు నెగ్గినాఁడు. కనుక నేనిప్పుడే వారికి నా దివ్యదర్శన మొసంగి తరింపజేసెద-నీవునురమ్ము.



తండోపతండములుగా వచ్చి గుమిగూడిన జనులు నిశ్చేష్టులై నిలిచియుండ యచ్చట క్రొత్తగా నిర్మించిన యిటుకల వేదికపై ధర్మాంగదుఁడు నిలిచి నిశ్చల మానసుఁడై యిట్లు ధ్యానించుచుండె-

నిరుపమాన దయానిధి నీవె నంచు
నమ్మియుంటిని పరమేశ నెమ్మనమున
తల్లి దండ్రుల యాజ్ఞను దలధరించి
ఇడువనుంటిని ప్రాణాల నిపుడు నేను
కలిపికొని నన్ను నీయందు కరుణతోడ
కాచి రక్షించుమయ్యనన్ గన్నతండ్రి.

"ప్రార్థన ముగిసినది నీ వని గానిమ్ము నాన్నా!" యని ధర్మాంగదుండు మౌనము వహించెను. అంతట రుక్మాంగదుండు ఖడ్గమెత్తి వ్రేటు వేయ నప్పటికప్పుడే ఖడ్గము మాయమయ్యెను. ధర్మాంగదుని మెడలో పూలమాల శోభించుచుండెను. తన వ్రేటు తప్పినందుల కాశ్చర్య విషాదము లంకురింప మరల వేరొక కటారిచేకొని "నేను శ్రీమన్నారాయణు పాదపద్మంబుల నిత్యము ధ్యానించు వాఁడనేని, సత్యము దప్పక రాజ్యపాలనం బొనర్చు న్యాయశీలుండనగు రాజునేని నా వ్రేటు దప్పకుండుగాక! యని కత్తినెత్త— "రుక్మాంగదా! ఆగుమాగు" మని వెనుక వైపుగా వచ్చి యెత్తిన కత్తిని వేరొక వ్యక్తిపట్టుకొనియె. రుక్మాంగదుండు వెనుకకుఁ దిరిగి చూచునప్పటికి "తన హస్తమును బట్టుకొని 'ఆగు' మన్న వ్యక్తి ఎవ్వరో కాదు. నిరంతర మెవ్వరిని తనకుఁ గైవల్య మొసంగుమని తాను ధ్యానించుచుండెనో, ఆ భక్త వత్సలుండైన పరమాత్మసర్వేశ్వరుఁడే సాక్షాత్కరించెను. అంతియే కాదు, ఒకవైపు నారదుఁడు చిరునవ్వు నవ్వుచుండెను. మరియొకవైపు పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమయియుండిరి. వేరొకవైపు వాణీచతుర్ముఖులు గోచరమగుచుండిరి. ఇంతయేల దేవతలందరు వేంచేసి యుండిరి. రుక్మాంగదుఁడానంద పరవశుఁడగుచు "దేవాదిదేవా! అది మధ్యాంత రహితా! అనాథరక్షకా! పాహిమాం, పాహిమాం! నీ దివ్య దర్శన మహాభాగ్య బొసంగి నా జన్మ ధన్యంబగునట్లు జేసితివి. నేడు నా జన్మ పావనమైనది". అని శ్రీహరి పాదపద్మములంటి ప్రణమిల్ల, లక్ష్మీపతి

రుక్మాంగదుని లేవదీసి హృదయమున కత్తుకొని "భక్తాగ్ర గణ్యా! రుక్మాంగదా! నా భక్తులందరిలోన సమాన ప్రజ్ఞా నిధివి నీవే సుమా! కొమరు వధింపనైన సంసిద్ధమైతివి కాని. ఏకాదశి వ్రతమును వీడవైతివి. ఇంత వంతకుఁ గారకు రాలైన మోహిని బ్రహ్మదేవుని ప్రేరణ వలన నిట్లు కోరి నది కాని మఱి యొండు కాదు. ఆమె లేకున్న నీ చరిత్రం బంత పవిత్రము కాదుగదా? అదిగో మోహినియును వచ్చు చున్నది. ఏమియో చెప్ప దలంచి నట్లున్నది. చూడుము. అంతట భువనమోహిని నారాయణునకు నమస్కరించి యిట్లు చెప్పదొడంగె- "పరాత్పరా! ఈ మహానుభావుని నే నిట్లు కోరుటకు కారణము. మా తండ్రిగారైన బ్రహ్మ దేవుని యాజ్ఞయే. ఏకాదశి వ్రతంబు మాన్పింప నిట్టి విషమ పరీక్ష పెట్టినందుకుఁ జాలచింతించుచున్నాను. నా మాట జవదాటనని ముందే మాటయిచ్చిన కతంబున నా భర్త గారైన రుక్మాంగదునితో మరియొక కోరిక కోరుచుంటిని. సత్య వాక్పరిపాలన నిమిత్త మదియును జేసితీరవలయును. పుత్త్రవధ మానుకొని ఏకాదశి వ్రతము నిర్విఘ్నముగా నెరవేర్చుకొనవలెను. మరియొక మాట! ఇప్పటి నుండి మీ యాజ్ఞకు నేనే బద్ధురాల నగుదునని సర్వేశ్వరుని పాద సాక్షిగఁ దెల్పుచున్నాను." అని పలుకుటతోడనే రుక్మాం గదుఁ డందుల కంగీకరించెను.

అంతట ధర్మాంగదుఁ డావధ్య వేదికనుండి దిగి నారా యణుని పాదారవిందములకు సాష్టాంగ నమస్కృతులొనర్ప, సర్వేశుఁడానంద భరితుఁడై యతనిని లేవదీసి "వత్సా! నీ

పితృభక్తికి, నీ సాహసమునకు, నీ ధర్మశీలతకు సంతసించితిని. నీ కెట్టి కోరిక గలదో వసింపు” మన ధర్మాంగదుఁ డిట్లనియె— “పరాత్పరా! మీ దర్శన మహాభాగ్యమున సర్వమును సమకూడియుండ నాకేమి కోరిక యుండును? ఐనను నిట్లను గ్రహింపుఁడు—

సీ॥ ఏకాదశి మహాత్మ్య మీగ్రంథ మెవ్వాఁడు
జదువునో వానిని జూకుమయ్యా!
చదివిన తనియక చక్కఁగా వ్రాసిన
నిహపర సుఖము లందించుమయ్యా!
చదువనేరక యుండి మెదలకవినువారి
దోసంబులను పారదోలుమయ్యా!
వినినది మరువక వివరించు వారికిఁ
గంటికి రెప్పగాఁ గావుమయ్యా!

తే॥గీ॥ కొల్లగా భక్తి భావాలు వెల్లివిరియ
జాతి మతముల కలహాలు నమసిపోవ
పాడిపంటలు జక్కఁగాఁ బ్రబలుచుండ
నీతినియమాలు లోకాన నిలుపుమయ్యా!

శ్రీహరి - తథాస్తు! రుక్మాంగదా! నీకేమి కోరిక గలదో తెల్పుము.

రుక్మా - పరాత్పరా! నీ సాన్నిధ్య భాగ్యమొసంగి నన్ను కృతార్థుని సేయ వేడుచున్నాఁడను. ఇదియే నా కోరిక.

శ్రీహరి - అట్లయిన కొలదికాల మీ భూవలయమందే నివసించి, ధర్మాంగదుని పట్టాభిషిక్తు గావించి, తదుపరి నా సాన్నిధ్య భాగ్యమందగలవు.

శ్రీహరి కరుణాకటాక్షమున రుక్మాంగదుఁడానంద భరితుఁడయ్యెను. చూచుచుండగనే శ్రీహరియును, దేవతలును నదృశ్యులైపోయిరి. నారదుని జిరుతల ధ్వనియును, మహతిస్వరమును. నారాయణ గానామృతము గలసి మనోజ్ఞ మధురమై సాగిపోయి గాలి కెరటాలలో విలీనమైపోయెను. పౌరుల ముఖమండలములందు దరహాస చంద్రికలు వికసించెను.

ఓమ్ శాంతి శ్శాంతిః



నా రచనల ప్రచురణకు విరాళము లొసగిన కొందరు వదాన్యులు.

తుళ్ళూరు

| | |
|---|---|
| శ్రీ గద్దె సీతారామయ్యగారు (సర్ పంచ్) | 58/- |
| శ్రీ తాడికొండ లక్ష్మినారాయణగారు (ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్ మేనేజరు) | 58/- |
| శ్రీ నెలకుదిటి శేషుబాబుగారు | 50/- |
| శ్రీ తాడిపనేని నరసింహారావుగారు | 25/- |
| శ్రీ జొన్నలగడ్డ వీరభద్రయ్యగారు | 25/- |
| శ్రీ జమ్ముల గోవర్ధనరావుగారు | 25/- |
| శ్రీ ఆలూరి రామలింగయ్యగారు | 25/- |
| శ్రీ జమ్ముల నరసింహారావుగారు | 25/- |
| శ్రీ గద్దే సత్యనారాయణగారు | 25/- |
| శ్రీ రచ్చా రాములుగారు | 25/- |
| శ్రీమతి గద్దే లక్ష్మిజ్వాలానరసమ్మగారు | 25/- |
| శ్రీమతి దామినేని కనకదుర్గగారు | 25/- |
| శ్రీ జొన్నలగడ్డ శేషగిరిరావుగారు | 25/- |
| శ్రీ కొమ్మినేని సాంబశివరావుగారు | 25/- |
| శ్రీ జొన్నలగడ్డ సాంబయ్యగారు | 25/- |
| శ్రీ చందోలు శివరామకృష్ణయ్యగారు | 25/- |
| శ్రీ జమ్ముల వెంకటేశ్వరరావుగారు (హోటల్) | 25/- |
| శ్రీ నలివేటి సతీష్‌బాబుగారు | 25/- |
| శ్రీ పి. పూర్ణచంద్రరావుగారు [డ్రా. మాస్టర్] | 25/- |

| | |
|---|---|
| శ్రీ పువ్వాడ శివప్రసాదుగారు | 25/- |
| శ్రీ జమ్ముల రఘునాధరావుగారు | 25/- |
| శ్రీ జమ్ముల గోపాలరావుగారు | 25/- |
| శ్రీ కొమ్మినేని రామాంజనేయులుగారు | 25/- |
| శ్రీ చింతా నరసింహారావుగారు | 25/- |
| శ్రీ పెనుమాక సాంబశివరావుగారు [హెల్త్ ఇనస్పెక్టర్] | 25/- |
| శ్రీ మాదల సాంబశివరావుగారు | 25/- |

పెదకూరపాడు

| | |
|---|---|
| శ్రీ పెనుముచ్చు సుబ్బారావుగారు [డ్రిల్ మాస్టర్] వీరిభార్య శ్రీమతి సీతారావమ్మగారు (టీచరు) | 116/- |
| శ్రీ డా॥ అవ్వారి అన్నప్పగారు | 58/- |
| శ్రీ చెరుకూరి పుల్లయ్యగారు (ఎరువుల కొట్టు) | 25/- |
| శ్రీ పొట్టి సత్యనారాయణగారు | 25/- |
| శ్రీ పొట్టి శ్రీనివాసులుగారు | 25/- |
| శ్రీ కోమటినేని రామారావుగారు | 25/- |
| శ్రీ మోతుకూరు పరబ్రహ్మాచార్యులుగారు | 25/- |
| శ్రీ నాదెళ్ళ పెదఅంకినీడుగారు | 25/- |
| శ్రీ పారాన్‌మల్‌గారు | 25/- |
| శ్రీ కంకిపాటి రాధాకృష్ణమూర్తిగారు | 25/- |

అనంతవరం (మంగళగిరి తాలూకా)

| | |
|---|---|
| శ్రీ యడ్లూరి సూర్యనారాయణగారు | 25/- |
| శ్రీ కొమ్మినేని పెదవెంకటేశ్వరరావుగారు | 25/- |

దొండపాడు

| | |
|---|---|
| శ్రీ కొమ్మినేని అప్పారావుగారు (సర్పంచ్) | 30/- |
| శ్రీ కొమ్మినేని నారాయణగారు | 25/- |
| శ్రీ వేజండ్ల వెంకట్రావుగారు | 25/- |
| శ్రీ డా॥ సంగెపు రామాంజనేయులుగారు | 25/- |
| శ్రీ కొమ్మినేని సత్యనారాయణగారు | 25/- |
| శ్రీ తల్లం సీతారామయ్యగారు | 25/- |
| శ్రీ కాకుమాను వెంకట్రావుగారు | 25/- |
| శ్రీ నెలకుదిటి రామారావుగారి భార్య శ్రీమతి వనజాక్షిగారు | 25/- |
| శ్రీ కొల్లి రామారావుగారు | 25/- |

---

సూచన :- ప్రచురింపబడుచున్న మా పుస్తకములు చందాదారులకు ఉచితము. భగవంతుడు వీరినందరిని బ్రోచుగాత !

రచయిత